# చిరుగజ్జెలు

( బాలల గేయాలు )

[ తెలుగు విశ్వవిద్యాలయ బాల సాహిత్యపు రచనల పోటీలో (1992) ఉత్తమ రచనగా అవార్డు పొందినది. ]

*వడ్డేపల్లి కృష్ణ*

ప్రచురణ :



ప్రథమ ముద్రణ : మే 1994



మూల్యము : రూ. 20/- ఇరవై రూపాయలు

ముఖచిత్రం : శ్రీ శీలావీర్రాజు

ముఖచిత్ర ముద్రణ : శ్రీ బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్,
చిక్కడపల్లి, హైదరాబాద్ - 500 020

ముద్రణ : మాధవీ ప్రింటర్స్, కుత్బిగూడ
హైదరాబాద్ - 500027

ప్రతులకు : 1. ఇంటి నెం. 5-62/3, చైతన్యపురి
హైదరాబాద్ - 5000 36

2. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
"విజ్ఞానభవన్", 4-1-435
బ్యాంక్ స్ట్రీట్ హైదరాబాద్-500 001

3. విశాలాంధ్ర బుక్ హౌస్ హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్టణం, తిరుపతి,
గుంటూరు, కాకినాడ, అనంతపురం,
హన్మకొండ.

# అంకితం



గాయకులు, రాజకీయ నాయకులు

## శ్రీ పి. వి. రాజేశ్వరరావు గారికి

బహుభాషాకోవిదుడు

భారత ప్రధాన మంత్రి

పి. వి. ప్రియతమ తనయుడు

విజ్ఞుడు - సంగీతజ్ఞుడు,

శ్రీ రాజేశ్వర రావుకు -
మృదు రాగేశ్వరరావుకు;

చిరుకానుకగా నా యీ
"చిరుగజ్జెలు" కావ్యమ్మును

అనురాగానికి గుర్తుగ
అంకితమ్ము గావించెద !

చిరకాలపు మైత్రికి ఒక
చిహ్నమ్ముగ భావించెద !



Office : 513351, 45718
Resi. : 234229, 235252

A. P. CONGRESS COMMITTEE

Gandhi Bhavan, Hyderabad-500 001.

Res. : Plot No. 68, Adarsh Nagar, Hyderabad-500 463.

P. V. RAJESHWARA RAO
General Secretary

Date : 8-6-1994

# స్వీకృతి

మిత్రులు,

శ్రీ వడ్డెపల్లి కృష్ణ గారికి !

మీరు ఆత్మీయంగా మీ "చిరుగజ్జెలు" కావ్యాన్ని నాకు అంకిత మీయదలచినందుకు ఎంతో సంతోషిస్తున్నాను. గతంలో మీ గీతాన్ని

"ద్వేషమే విడనాడితే
ఈ దేశమే నవనందనం !
ప్రేమతో మనగలిగితే
నీ హృదయమే శ్రీచందనం !" అని

ఆకాశవాణిలో స్వరమెత్తగలిగినందుకు పులకిస్తున్నాను. నిజమైన నిర్మల ప్రేమతో మీరు అందజేస్తున్న యీ కావ్యచందనం అందుకొని, మీకు ఉజ్వల భవిష్యత్తు కలగాలని ఆకాంక్షిస్తున్నాను—

భవదీయ

**పి. వి. రాజేశ్వరరావు**

# ప్రేరణ

గత పాతికేళ్ళుగా సాహితీ వ్యవసాయం సాగిస్తున్న నాకు 1992వ సంవత్సరానికి తెలుగు విశ్వవిద్యాలయం బాలసాహిత్యపు రచనల పోటీకి వివిధ రచయితల నుండి రచనల్ని ఆహ్వానిస్తూ వెలువరించిన ప్రకటన దినపత్రికల్లో అగుపడింది. తద్వారా నాలో వినూత్న ప్రేరణ బలపడింది.

వెంటనే రచనకుపక్రమించి, ''చిరుగజ్జెలు''గా రూపొందించి పోటీకి పంపగా దానికే అవార్డు లభించింది. న్యాయ నిర్ణేతల సూచనల మేరకు ఈ విధంగానైనా తెలుగు విశ్వవిద్యాలయం నా కృషిని ఆదరించినందుకు కాస్త సంతృప్తి కలిగింది.

ఇందలి గేయాలు ఇప్పటికే కొన్ని ఆకాశవాణి ద్వారా, మరికొన్ని దూరదర్శిని ద్వారా ప్రసారమై ప్రజాదరణ పొందాయి. ''భావిపౌరులు'', "బాలానందం - భాగ్యనగర అందం" అను సంగీత రూపకాలు ఇటీవలనే దూరదర్శినిద్వారా అశేష ప్రేక్షకాభిమానాన్ని విశేషంగా చూరగొన్నాయి.

ఇంతవరకు సినిమాలకే గాక ఏడు కావ్యాలకు, ఏడు క్యాసెట్లకు రచన చేసిన అనుభవంతో ప్రస్తుతం ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత స్థాయి విద్యార్థులందరికీ ఉపకరించేలా ఈ ప్రయత్నం చేశాను. అయితే నా ప్రయత్నం ఎంతవరకు సఫలీకృతమైందో సహృదయ పాఠకులు, సద్విమర్శకులే తేల్చి చెప్పాలి.

నా యీ రచనకు అవార్డు ప్రకటించి అయిదు వేలతో ఆదరించిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి—

ఇలా అక్షర రూపం కలిగించిన మాధవీ ప్రింటర్స్‌కు—

ముఖపత్రాన్ని సింగారించిన శ్రీ శిలావీర్రాజు, బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్‌కు—

అభిమానంతో నా గీతాల్ని ఆకాశవాణిలో పాడడమేగాక ఆత్మీయంగా స్నేహహస్తం చాచి అంకితం గైకొన్న శ్రీ పి. వి. రాజేశ్వర రావుకు—

ఇందలి గీతాల్ని-సంగీత రూపకాల్ని ప్రసారం చేసిన ఆకాశవాణి / దూరదర్శినిలకు ఈ శుభ సందర్భంగా నా కృతజ్ఞతలందజేస్తున్నాను.

వడ్డేపల్లి కృష్ణ



# దీవించుము తల్లీ

జయ జయ జయ భారతీయ
కళారాణి వాణీ !........
మాకు చదువు లందించుము
మాతా పుస్తకపాణీ !....  ॥జయ॥

నిర్మలమగు మనసుతో
నిను కొలిచే విద్యార్థుల
నిరంతరం కాపాడుము
నిత్యం జయమందించుము  ॥జయ॥

విద్య వినయ-విధేయతల
నొసగు కల్పవల్లీ !....
దివ్యముగా వెలుగొందగ
దీవించుము తల్లీ !....  ॥జయ॥

# మంచి మాటలు

పెందల కడనే లేవాలి
ముందుగ ముఖమే కడగాలి
శుచిగా స్నానం చేయాలి
వేళకు బడికే పోవాలి

*   *   *

గురువే ప్రత్యక్ష దైవం
గురువే విజ్ఞాన విశ్వం
గురువు నందుకే గౌరవించు
చదువుల సారం ఆస్వాదించు

*   *   *

తల్లి దండ్రులు దైవ స్వరూపులు
అగౌరవించిన వారు పాపులు
తండ్రిమాట జవదాటని రాముడు
జగమంతటికీ ఆయెను దేవుడు

# పాపా! పరుగెక్కడికే?

పాపా ! పాపా ! పరుగెక్కడికే ?
చదువులు నేర్పే పాఠశాలకే !
పాఠశాలలో చదువు దేనికే ?
తెలివి తేటలు పెంచడానికే !
తెలివి తేటలు నీకు దేనికే ?
మంచి మనిషిగా మసలడానికే !

* * *

పాపా ! పాపా ! పరుగుదేనికే ?
పండ్లూ, పాల బువ్వ తినుటకోసమే !
పండ్లూ, పాలబువ్వ తినుట దేనికే ?
ఆరోగ్యంగా ఎదగడానికే !
ఆరోగ్యంగా ఎదుగుడెందుకే ?
దేహం-దేశం రక్షించుటకే !

## దానిమ్మ

అమ్మమ్మా ! దానిమ్మా !
తింటే ఎంతో రుచిగుండు !
అజీర్తి - వాంతులు తొలగించే
అద్భుత గుణాలు కలిగుండు !

## అరటి

అందరికీ అందుబాటులో
ఉండే పండు, అరటిపండు !
అను దినమూ తింటుంటే
ఆరోగ్యం బాగుండు !

## చెట్లునాటాలి

నీడను ఫలాల నిచ్చే చెట్లను
నిరతము ఎల్లెడ నాటాలి !
తోటలు పెంచిన వానలు కురియును
వానలు కురిసిన బాధలు దీరును

# పాలపిట్ట

పాలపిట్ట... పాలపిట్ట ...
పలకనన్నది !...
పగటి పూట అందంగా
కులక నన్నది !.... ॥పా॥

అత్త తెచ్చిన కొత్త చీర
కట్ట నన్నది !.,.
మామ యిచ్చిన మంచి నగలు
పెట్టనన్నది !... ॥పా॥

వదిన పెట్టిన గాజులైన
వద్దన్నదీ ! ...
మరిదితోడ మాటకైన
హద్దన్నదీ !... ॥పా॥

చుట్టాల కాన్కలేవి
చూడ నన్నది !...
మాపటేళ మగని చేయి
వీడనన్నది !... ॥పా॥

# వృత్తులు

చక్రం గిర గిర తిప్పేవాడు
మట్టితో కుండలు చేసేవాడు
కుమ్మరీ - కుమ్మరీ ...

ఇనుప ముక్కలను కాల్చేవాడు
పలుగు పారలను చేసేవాడు
కమ్మరీ - కమ్మరీ...

ఇసుక - సిమెంటును కలగలిపి
ఇటుక రాళ్లను పేర్చేవాడు
మేడలు, మిద్దెలు కట్టేవాడు
మేస్త్రీ ! మేస్త్రీ ....

రంపం, బాడిస ఉపయోగించి
ఇంపుగ తలుపులు చేసేవాడు
ఇంటిని బాగా తీర్చేవాడు
వడ్రంగీ ! వడ్రంగీ ....

పగ్గం మగ్గం చేతను పట్టి
పడుగు పేకలను నేసేవాడు
గుడ్డలు మనకందించే వాడు
సాలీడు ! సాలీడు ...

ఎండ వానలను లక్ష్యపెట్టక
కండలన్ని కరిగించే వాడు
నేలదున్ని పండించే వాడు
రైతన్నా ! రైతన్నా !

బంగారమును కొలిమిలో వేసి
సింగారాల నగలను చేసి
స్త్రీలకు అందం తెచ్చేవాడు
కంసాలీ ! కంసాలీ !



# పొడుపు కథలు

1

చుక్ చుక్ మంటూ వెళ్ళేది
చక చక పరుగులు తీసేది
బోలెడన్ని బోగీలను కలగి
చాలా దూరముకలతిరిగేది
ఏది ? - రైలుబండి !

2

పల్లెలకైనా-పట్నం కైనా
ప్రజలను తీసుకు వెళ్ళేది
అందరికీ అందు బాటులో
వుంటూ రోడ్డున తిరిగేది !
ఏది ? - బస్సు !

3

ఆకాశంలో పయనించేది
అధిక వేగమున పరుగెత్తేది
విదేశాలకూ చిటికెలో చేరగ
వీలయ్యే గాలి మోటరు
ఏది ? - విమానం !

4

నీటి పైన తేలేది
చేపలాగ పోయేది
భారమైన సరుకుల్ని
భద్రంగా మోసేది
తెడ్డు వేస్తే చాలు
ఒడ్డు కడకు చేర్చేది
ఏది ? - నావ



# జంతువులు

"మ్యావు మ్యావు" మని ఎలుకల్ని
మట్టు పెట్టునది ఏది ? - పిల్లి !

విశ్వాసంతో "భౌ భౌ" అంటూ
ఇల్లు కాపలా కాసేది
మిత్రునిలా తోడై వుంటూ
దొంగల్ని దొరక పట్టేదేది ? - కుక్క !

"అంబా" అంటూ పచ్చిక మేస్తూ
అమ్మ మాదిరిగ పాలను యిస్తూ
పిల్లల పెద్దల పోషించేది
ఎల్లరి మన్ననల పొందేదేది ? - ఆవు !

కుక్కను బోలిన ఆకారం
కుటిల బుద్ధి కది సాకారం
ఎత్తులు వేసే జిత్తుల మారి
ఏమిటది ? ఏమిటది ? - నక్క !

ఒంటి నిండా చారలతో
కంటి నిండా క్రౌర్యంతో
బెదిరి పోవగా గాండ్రించేది
ఏది ? -బెబ్బులి !

బారెడు తొండము ఆడ
మూరెడు దంతము తోడ
నల్ల గుండులా నడిచేది
ఏది ? - ఏనుగు

పట్టిన పట్టును విడవకా
మృత జీవాలను ముట్టకా
ముందుకు మూరెడు మూతితో
దేహమంత రోమాలతో
అడవిలోన అగుపించేదేది ? - ఎలుగుబంటు



# పక్షులు

1

కరి మబ్బులను చూడగనే
పురి విప్పుకొని ఆడేది
కుమార స్వామికి వాహనమై
కులికే పక్షి ఏది ? - నెమలి

2

వేకువ జామున మేలుకొని
కావు కావుమని అరిచేది
అందరి ఇళ్లూ తిరిగేది
కారు నలుపుగలదేది ? - కాకి

3

ఆకు పచ్చని దేహంతో
ఆపై ఎర్రని ముక్కుతో
పండ్లన్నీ పరీక్షించునది
పలుక నేర్చినది ఏది ? - చిలుక

## 4

పెందలాడనే మేలుకొని
కొక్కొ్కరకోయని కూసేది
పందెములందున పాల్గొని
పల్లె పల్లెనూ లేపేది
ఏది ? - కోడిపుంజు !



# చెట్లు

చేదు గుణాలను కలిగున్నా
మంచి గాలి నందించేది
ఉగాది పచ్చడిలో విధిగా
ఉంటానంటూ వచ్చేది
ఏది ? - వేప చెట్టు !

మండు టెండలో మధుర రసాలను
మెండుగా అందించేది
శుభ కార్యాలకు మన గుమ్మాలకు
తోరణాలుగా నిలిచేది
ఏది ?- మామిడి చెట్టు !

అన్నం తినగా ఆకులను
ఆకలి తీరగ ఫలాలను
ప్రేమగా అందించేది
పెరటిలోనూ మొలిచేది
ఏది ? - అరటి చెట్టు !

# జాతీయ పండుగలు

కుల మత భేదాలన్నీ మరచి
ఒక్కటిగా కూడి చేసుకొన
జాతి నంతటిని ఏకం చేసే
జాతీయ పండుగలేవి ?

1. స్వాతంత్ర్య దినం
2. గణతంత్ర దినం
3. గాంధీ జయంతి

# సమానత్వం

ఆటల నైనా - పాటల నైనా
అభ్యాసం అలవడితే
శ్రద్ధాసక్తిగ చదువులనన్నీ
బుద్ధిగా గ్రహియిస్తే
ఆడా మగా తేడాలేక
అందరు ప్రగతిని గాంచేరు !

# ప్రార్థనా స్థలాలు

1

కనువిందగు గోపురాలతో
కమనీయపు విగ్రహాలతో
వేద మంత్రముల జేగంటలతో
వేదుకైనది ఏది ? ఏది? ...

అది హిందువులందరు ఆరాధించే
ఆలయం ! దేవాలయం !

2

"అల్లాహో ! అక్బర్" అంటూ
ఎల్లలు ప్రతి ధ్వనించేలా
మత సూక్తులను వినిపించేది
మన దేశమ్మున ఏది ? ఏది ?....

మహమ్మదీయులు ఆరాధించే
మసీదు ... అది మసీదు...

3

బైబిలు సూక్తులు వినిపించేది
బాధలనన్నీ మరిపించేది
సాటి వారికై శిలువను మోసిన
శాంతమూర్తి ఆలయమేది ?

క్రైస్తవులంతా ఆరాధించే
క్రీస్తు నివాసం - "చర్చి" అది !



వడ్డేపల్లి కృష్ణ

# అక్షరాలను నేర్వండి!

బుడి బుడి నడకల పిల్లల్లారా
వడి వడిగా రారండి !
అఆఇఈ అంటూ అంతా
అక్షరాలను నేర్వండి ! ॥బుడి॥

పలకా బలపం పట్టండి !
చిలక పలుకులే నేర్వండి
ఓనమాలను దిద్దండి !
జ్ఞానం బాగా పొందండి ॥బుడి॥

నీరులేని ఏ పొలమైనా
నిష్ప్రయోజనం అయినట్లే
చదువురాని ప్రతి బ్రతుకంతా
పనికిరాని బీడవుతుంది ! ॥బుడి॥



# అక్కా - చెల్లీ

అక్కా : నిదురలేవే చెల్లి
నిదుర లేవమ్మా !...
నిదుర పోతే నీకు
సుఖము లేదమ్మా ! ... ||ని||

చెల్లి : నిదుర పోవాలింక
నను లేపకక్కా !...
పొద్దుననగా లేచి
ఏం చేతునక్కా ? ....

అక్కా : బుద్ధిగా బడికెళ్ళి
ఓనమాలను దిద్ది
చదువుకుంటే నీకు చెల్లీ !...
సకలమేలూ కలుగు చెల్లీ !... ||ని||

చెల్లి : చదువుకుంటే నాకు అక్కా !
ఒరిగేది ఏముంది అక్కా ?...

అక్క : శ్రద్ధగా చదివి నువ్వు
పెద్దగా ఎదిగితే ...
మంచి మగడే దొరుకు చెల్లీ !
బతుకంత బాగవును చెల్లీ ।

చెల్లి : అట్లయితే బడికెళ్ళి అక్కా !
అన్ని చదివేస్తాను అక్కా !... ॥ని॥



# చదువొస్తే పెద్దరికం

చదువొస్తే పెద్దరికం !...
చదువొస్తే సర్వసుఖం !... ॥చ॥

చదువొస్తే సంఘంలో
సమకూరేను పెద్దరికం !
చదువొస్తే లోకంలో
బతుకంతా సర్వసుఖం ॥చ॥

అన్నల్లారా ! అక్కల్లారా !
తమ్ముళ్లారా ! చెల్లెళ్లారా !...
అందుకే మనమంతా
అక్షరాలు నేర్చుకుందాం !... ॥చ॥



22

వడ్డెపల్లి కృ॥

# గుడ్డిగా పడి వుంటారా?

మాను ఎదుగుటకు ఎరువు
మనిషి ఎదుగుటకు చదువు
కావాలీ ! కావాలీ !...
కావున అంతా చదవాలీ !... ॥మా॥

ఎరువు లేని ఏ పంటయినా
నిస్సారం ! నిస్సారం !...
చదువురాని ఏ మనిషయినా
నడువలేని నత్త సమానం ॥మా॥

అంధులు గూడ చదువునేర్చి
ముందుకు సాగిపోతుంటే
కళ్లుండీ చదువు నేర్వక
గుడ్డిగా పడి వుంటారా ?... ॥మా॥



# వెన్నెలపాట

వెన్నెల - వెన్నెల - వెన్నెలా ...
బతుకంత పున్నమి వెన్నెలా... ॥వెన్నెల॥

బడికెళ్లి చదివితే వెన్నెలా ...
బంగారు జాతకం వెన్నెలా ...
పలక బలపం పట్టి వెన్నెలా....
చిలకలా నేర్చితే వెన్నెలా....
చిత్రంగ చదువొచ్చు వెన్నెలా...
సిరులెన్నో మీకిచ్చు వెన్నెలా ... ॥వెన్నెల॥

సిరులైతె దొంగలూ వెన్నెలా....
దోచుకుంటే పోవు వెన్నెలా....
చదువైతె దొంగకూ వెన్నెలా ....
దోచుకోనే రాదు వెన్నెలా....
అట్టి చదువూ చదివి వెన్నెలా ....
అభివృద్ధి పొందాలి వెన్నెలా.... ॥వెన్నెల॥



# పొడుపు కథల పాట

అక్కయ్యలు : చిట్టీ పొట్టీ తమ్ముళ్లారా !
చిక్కులు విప్పి చెపుతారా ?
పొడుపు కథలలో మాతో సమముగ
పోటీగా నిలబడతారా ?....

తమ్ముళ్లు : చిక్కుల ప్రశ్నల అక్కల్లారా !....
చక్కగ జవాబు చెబుతాము
పొడుపు కథలలో మీతో దీటుగ
పోటీగా నిలబడతాము

అక్కయ్యలు: అయితే కాచుకోండి !
పిల్లల కెంతో ప్రియమగు వాడు
పంచమ వేదం వ్రాసిన వాడు
ముందుగ దండం పెడితే చాలు
అందరి కన్నీ యిచ్చేవాడు

ఎవ్వరో వివరిస్తారా ?
చేతులే జోడిస్తారా ?

తమ్ముళ్ళు : ఓస్ యింతేనా ?
పిల్లలకెంతో ప్రియమగువాడు
పంచమ వేదం వ్రాసిన వాడు
ముందుగ దండం పెట్టిన వెంటనె
విద్యల నిచ్చును - విఘ్నేశ్వరుడు !

అక్కయ్యలు : రెక్కలు లేకనె పైకెగిరేది
దిక్కులనన్నీ తిరిగేసేది
గళము లేకనే గర్జించేది
జగము నంతటిని పోషించేది

ఏమిటో వివరిస్తారా ?
చేతులే జోడిస్తారా ?

తమ్ముళ్ళు : ఏమిటబ్బా ? ఆఁ !....
రెక్కలు లేకనె పైకెగిరేది 
దిక్కుల నన్నీ తిరిగేసేది
గళము లేకనే గర్జించేది
కారు మేఘమే ! కాదంటారా ?

అక్కయ్యలు : వేలెడంత తెల్లని దానికి
ఏనుగంత నల్లని మిత్రుడు !
ప్రతి గదిలోనూ ప్రత్యక్షం
అది లేకుంటే బడి నిర్లక్ష్యం !

తమ్ముళ్ళు : ఆఁ తెలిసిపోయింది !
ఏనుగంత నల్లని మిత్రుడు - నల్లబల్ల
వేలెడంత తెల్లనిదేమో- సుద్దముక్క
క్లాసు రూములో తప్పని సరిగా
కనిపిస్తాయే పెద్ద అక్క !

అక్కయ్యలు: అరెరే చెప్పేశారే !

॥చిట్టి॥
॥చిక్కుల॥

అక్కయ్యలు: పొట్టనిండా రత్నాలున్న
పొట్టిది గట్టిది ఒక గుమ్మా !
పొట్టకే అజీర్తి చేస్తే
పోగొడుతుంది అదిలెమ్మా !

తమ్ముళ్ళు : ఆఁ ।పొట్ట నిండా రత్నాలున్న
పొట్టిది గట్టిది దానిమ్మా !
పొట్టకే అజీర్తి చేస్తే
పోగొడుతుంది ఓయమ్మా !

అక్కయ్యలు: నోటికి ఎంతో తీపిని యిస్తూ
కంటికి ఎంతో మేలును చేస్తూ
డొక్క చీల్చినా తాను ఏడ్వక
దోసెడు రసాన్ని అందించేది

ఏమిటో వివరిస్తారా ?
చేతులే జోడిస్తారా ?....

తమ్ముళ్ళు : చీటికి మాటికి నోరూరిస్తూ
విటమిన్ "ఏ" లను కంటికి యిస్తూ
డొక్క చీల్చినా మధుర రసాన్ని
అందించేదే మామిడి పండు !....

అక్కయ్యలు: మెల్లగ నడిచే పొట్టి రాజుకు
చకచక నడిచే పొడుగు రాణీ !...
ఒకే రోజుకు గంపెడు పిల్లలు
చెవులు పిండితే అల్లరి కొల్లలు !....

ఏమిటో ఎరిగిస్తారా ?....
చేతులే జోడిస్తారా ?....

తమ్ముళ్ళు : అమ్మో ! చిక్కు ప్రశ్నే !.... ఆఁ ! తెలిసింది
పొట్టి రాజే చిన్నముల్లు
పొడుగు రాణే పెద్దముల్లు
గంపెడు పిల్లలు గంటలు కావా ?
అల్లరే 'అలారం' కాదా ?

అక్క ॥చిట్టి॥
తమ్ము ॥చిక్కుల॥

అక్కయ్యలు: ఒళ్ళంతా ఒకటే మాదిరి
పళ్ళున్నా కరవదు తినదూ ....
అది లేకుంటే మనందరికీ
అలంకారమే అసలు జరగదూ !....

తమ్ముళ్ళు : ఒళ్ళంతా ఒకటే మాదిరి
పళ్ళున్నా కరవక తినకా ....
చిందర వందర వెంట్రుకలన్నీ
సుందరముగనే తీర్చును "దువ్వెన"

చిరుగజ్జెలు

అక్కయ్యలు: దొంగల చేతికి దొరకని ధనము
దానం చేసిన తరగని ధనము !
అది కలిగుంటే ఎక్కడి కేగిన
ఆదరింతురు అదియే నిజము !

ఏమిటో ఎరిగిస్తారా ?
చేతులే జోడిస్తారా ?

తమ్ముళ్ళు : దొంగల చేతికి దొరకని ధనము
దానం చేసిన తరగని ధనము
ఎక్కడి కేగిన దొరలను చేసే
ఏకైక ధనమ్మే.... "చదువు"

అక్కయ్యలు: అందుకే మీరంతా బాగా చదవాలి !
॥చిట్టీ॥
॥చిక్కాల॥

అక్కయ్యలు: చెట్టుకానిది ఒక చెట్టు
కాల గమనమే చూపెట్టు
దానికి కొమ్మలు పన్నెండు
కొమ్మ కొమ్మకూ ముప్పైపూలు !

తమ్ముళ్ళు : చెట్టు కానిది ఆ చెట్టు
సంవత్సరమును చూపెట్టు !
కొమ్మలేమో మాసాలు
ముప్పై పూలే రోజులు !

అక్కయ్యలు: కత్తి పెరిగిన ఈ కాలంలో
కత్తి అసలే చేయరానిది
బోడి గుండుతో ఆకర్షిస్తూ
బోలెడు బలాన్ని అందించేది

ఏమిటో ఎరిగిస్తారా ? ....
చేతులే జోడిస్తారా ? ....

తమ్ముళ్ళు : కత్తి పెరిగిన ఈ కాలంలో
కత్తి చేయగ వీలులేనిది
బోడి గుండుతో బోలెడు బలాన్ని
అందించేదే - కోడిగుడ్డు !....

అక్కయ్యలు: అరెరే .... అన్నీ చెప్పేస్తున్నారే !
పైన చూస్తే కటుకుదనం
లోన చూస్తే కమ్మదనం
గుండె నిండా తీయని పాలు
గుట్టుగ పుట్టిన మురిపాలు

ఏమిటో ఎరిగిస్తారా ?....
చేతులే జోడిస్తారా ? ....

తమ్ముళ్ళు : అయ్యయ్యో ! ఇదేమిటో తోచడంలేదు !

అక్కయ్యలు: ఈ మాత్రం చెప్పలేరట్రా ?
అది .... కొబ్బరి కాయ !

తమ్ముళ్ళు : భలే భలే ! కొబ్బరికాయా ?
అక్కయ్యలు : ॥చిట్టి॥
తమ్ముళ్ళు : ॥చిక్కులు॥



# జాతి నేతలు

## (జాతిపిత)

సత్యాహింసలె నమ్మాడు
సత్యాగ్రహమే నడిపాడు ;
తెల్ల దొరలనే తరిమాడు
తల్లి చెరను విడిపించాడు
బోసి నవ్వుతో - బోడి గుండుతో
దేశం హృదయం దోచాడు
అతడే అతడే జాతిపితా !....
అతడే మన స్వాతంత్ర్య కథా !



## (శాంతిదూత)

మహాత్మ గాంధీ సహచరుడై
స్వరాజ్య సమరం సలిపాడు
స్వతంత్ర భారత ప్రధానియై
"పంచ శీల"నే చాటాడు

తలపై తెల్లని టోపీతో
ఎదపై ఎర్ర గులాబీతో
పిల్లలనే ప్రేమించాడు
"చాచాజీ" గా నిలిచాడు

అతడే అతడే శాంతిదూత
మన నవభారత నిర్మాత



## (జాతినేత)

తుచ్ఛులైన ఆంగ్లేయుల
తుడిచి పెట్టదలచి
"ఆజాద్ హింద్ ఫౌజ్"
అధినేతగ నిలిచి
స్వాతంత్ర్య సాధనకై
సమరభేరి మ్రోగించి
ప్రభలొలికిన జాతినేత
సుభాస్ చంద్రబోస్ !



## (ఉక్కు మనిషి)

స్వతంత్ర భారతావనిలో
సంస్థానముల కలిపినవాడు
గాంధీజీకి చాచాజీకి
కుడి భుజమై నిలిచిన వాడు
అమోఘ దీక్షా పట్టుదలలతో
అల్లర్లన్నీ త్రుటిలో అణచి
"ఉక్కు మనిషిగా" ఖ్యాతికెక్కిన
ఉన్నతుడు, సర్దార్ పటేల్ !

# అనగనగా ఒక కోతి !

అనగనగా ఒక కోతి
దానికి లేదు భీతి
"టెర్రరిస్టు"లా అడవి కంతటికి
తెచ్చుకున్నది ఖ్యాతి ! ||అ||

పనికి మాలిన కోపంతో
పాడు రాక్షసి రూపంతో
కొమ్మలు రెమ్మలు విరిచేస్తూ
చెట్లనన్నిటిని ఊపేస్తూ

అడ్డు పడే పలు పక్షులనన్నీ
అదేపనిగనూ చంపేస్తూ
చిందులు తొక్కుతు ఎగిరింది !
అడవిని అల్లరి చేసింది !
అడవి కంతటికి తానే రాజని
అహంభావముగ పలికింది ! ||అ||

అంతలో పలు పావురాలు
చింతిస్తూ ఆ కోతితో

"ఎందుకు మమ్ముల హింసిస్తావు,
ఏ పాపము మేమెరుగముగా ?
సహనం తోడ జీవించేము
శాంతికి మేమే సంకేతముగా !

హింసా మార్గము విడనాడి
ఇకనైనా మము వదలేయీ !"
అని ఆర్తిగ అర్థించిననూ
ఆగ్రహముగ బాదేసింది ! ॥అ॥

అప్పుడక్కడకు పక్షి రాజగు
డేగ రివ్వుమని వచ్చింది !
సత్వరమే తన పక్షులన్నిటికి
చక్కని సలహా యిచ్చింది ! ॥అప్పు॥

"మంచి మాటతో వినని వాళ్ళతో
మర్యాదలతో పనిలేదు !
హితమును పెడచెవి పెట్టువారికి
హింసయే యిక తగిన జవాబు ! ॥అప్పు॥

ముక్కులు పదు నెక్కించు కొని
ముష్కర కోతిని ఒక్కుమ్మడిగ
చుట్టుముట్టుడని చెప్పగనే
ఓ- పట్టు పట్టుడని తెలుపగనే

పక్షులన్నీ కలిసి కట్టుగా
పదే పదే ఎగిరి తన్నగా
ముక్కోపి యగు కోతి కళ్లను
ముక్కులతో పొడిచి వేయగ
హాహా కారము చేయుచు కోతి
అంధురాలిగా మారింది ! ॥అ॥

అనవసరముగా హింసను కోరి
అనర్థాల కెరయైతినని
గుడ్డిగ పక్షుల చంపినందుకు
గుడ్డిదాననై పోతినని
తోక ముడుచుకొని పరితాపంతో
ఏక ధారగా ఏడ్చింది !
దిక్కుతోచని అడవి లోపల
దీనురాలిగా మిగిలింది ! ॥అన॥

# అడవి

అడవికి వెళ్దాం రారండి !
అన్నీ చూద్దాం రారండి !
ఒంటికి చారలు కలిగుండి
గాండ్రించేను పెద్దపులి !
గుండ్రని నల్లని మచ్చలతో
వడిగా ఉరుకును చిరుతపులి ! ॥అడ॥

ఒళ్లన్నీ రోమాలుండే
మూతి పొడవుది ఎలుగు బంటు !
తొండం దంతం కలిగుండి
ఎత్తుగ వున్నది ఏనుగు ! ॥అడ॥

తలకు జూలుతో మృగరాజై
గర్జించి దూకునది సింహము !
జిత్తులమారి నక్క, జిరాఫీ
కోతులు తోడేళ్ళెన్నెన్నో !....



## నెమలి

మబ్బులు కమ్మే వేళలో....
అబ్బురంగ పురులన్ని విప్పి
ఆనందంగా నాట్యం చేయును
అడవిలోన అందాల నెమలి !



## ఏనుగు

చేటల్లాంటి చెవులతో ...
స్తంభాల్లాంటి కాళ్ళతో ....
తెల్లని దంతం - నల్లని కాయం
తొండం కలిగుండేది ఏనుగు !



# పెంపుడు జంతువులు

## (కుక్క)

అన్న : విశ్వాసానికి మారుపేరుగా
ఇంటి కాపలా కాచేది
"భౌ ! భౌ !" అంటూ అరిచేది
దొంగలనూ పసిగట్టేది

ఏమిటదీ ? ఏమిటదీ ?
చెప్పు చెల్లీ ! ఏమిటదీ ?

చెల్లి : ఆఁ ! చక్కగ మనిషికి అక్కరకొచ్చే
కుక్క అదీ ....కుక్క అదీ ....



(పిల్లి)

అన్న : మనతో యింట్లో తిరిగేను
"మ్యావ్ ! మ్యావ్ !" మని అరిచేను ! ....
పులికి మామగా పేరుగడించి
ఎలుకలనే వేటాడేను !
ఎరిగించాలిక ఏమిటదీ ?

చెల్లి : ఆఁ .... పిల్లల పెద్దల నలరించే
పిల్లి అదీ.... పిల్లి అదీ ....

(కుందేలు)

అన్న : చెంగు చెంగుమని దూకేను
చెవుల పిల్లిగా సాగేను !
తెల్ల తెల్లని బొచ్చుతో
కళ్లను ఆకర్షించేను ! ....
ఏమిటదీ ? ఏమిటదీ ?
చెప్పవె చెల్లీ ! ఏమిటదీ ?

చెల్లి : ఆఁ ! కుతూహలం రేకెత్తించే
కుందేలు - అది కుందేలు .... !



# అందరూ సమానమే

ఆడయినా... మగయైనా
అందరూ సమానమే !...
పాపలిద్దరూ కంటి-
పాపలతో సమానమే !... ||ఆ||

రుద్రమ - ఝాన్సీలు గూడ
అతివలె అయినప్పటికీ
రుద్ర పరాక్రమము చాటి
ఘనకీర్తిని గనలేదా ? ... ||ఆ||

కమలా నెహ్రూ జంటకు
కలిగిన "ఇందిరా గాంధి"
మగువగ జన్మించిననూ
మన ప్రధాని కాలేదా ? ... ||ఆ||

అబ్బాయంటే మోదం
అమ్మాయంటే ఖేదం
అనుకుంటే అది తప్పు
వినకుంటే మరి ముప్పు ||ఆ||

# తెలిసీ తెలియని భావి పౌరులం

తెలిసీ తెలియని భావిపౌరులం !
విరిసీ విరియని పూల రేకులం !
తప్పుల గ్రహించి జీవిస్తాం ! ....
మెప్పుగ యికపై అడుగేస్తాం ! .... ॥తె॥

కదిలే బస్సుల ఎక్కక దిగకా
కడు భద్రతతో పయనిస్తాం ! ....
"ఫుట్ పాత్" లనే ఉపయోగిస్తూ
ఇటు అటు చూసి రోడ్డు దాటుతాం ! .... ॥తె॥

గాలి పటాలు, బంతులాటలు
గంతులు వేయుచు రహదారులపై
ఆడకూడదని చాటిస్తాం !
"ట్రాఫిక్ రూల్స్"ను పాటిస్తాం ! ॥తె॥

ఆటో, లారీ, బస్సులు నడిపే
అయ్యల్లారా ! అన్నయ్యల్లారా ! ...
దారులలో మేమెదురుగవస్తే
దయతో వేగము తగ్గించండీ ! ... ॥తె॥

# మనమంతా ఒక్కటనే

మనమంతా ఒక్కటనే
మంచి మనసు పెరగాలి !
జగమంతా మనమే యను
మంచిరోజు రావాలి ! ॥మ॥

మల్లిక మల్లికను చేరి
మాలగ రూపొందునుగా ! ....
మాలలు మలిచేందుకు
ఒకదారమె ఆధారముగా ! ... ॥మ॥

బిందువు బిందువును చేరి
సింధువుయై పారునుగా ! ...
సింధువు సింధువును చేరి
సంద్రముగా మారునుగా ! ... ॥మ॥

వెన్ను పోటు పొడువ కాచు
కున్న దుష్ట శక్తులను
పసిగడుతూ అణచాలి !
ప్రతిభతో రాణించాలి ! ॥మ॥

# నివారించు కాలుష్యం

నివారించు నివారించు
నీ పరిసర కాలుష్యం ! ....
లేకుంటే చెడిపోవును
ఆవరణం అవశ్యం ! ॥ని॥

ఇల్లు మాత్రమే కాదు
ఇరు వైపుల వీధులనూ
శుభ్ర పరచుకోవాలి !
సుందరముగ నిలపాలి ! ॥ని॥

జనులకు అత్యవసరమగు
గాలి, నీటి నన్నిటినీ ....
కాలుష్యం నుండి మనం
కాపాడుట నేర్వాలి ! ... ॥ని॥

పట్నపు ధ్వని కాలుష్యం
పల్లెల జల కాలుష్యం
సత్వరం నివారించు
పరిసరాల రక్షించు ॥ని॥

# పొదుపు – ఇంధనం

పొదుపు చేయు ఇంధనం
అది ప్రకృతి మూలధనం ! ....
నిలువలన్ని అడుగంటిన
నిఖాసమే దుర్భరం ! .... ॥పొ॥

బొగ్గు, గ్యాసు, విద్యుత్తూ
తాగే నీటిని సైతం
పొదుపుగా వాడాలి !
పొందికగా మసలాలి ! ॥పొ॥

కలప, కాగితం నైనా
కనీసావసరముకే
ఉపయోగించాలంతా ....
ఎప్పుడూ కొంత కొంతా .... ॥పొ॥

మైలు దూరానికైన
కాలి నడకయే మేలు !...
సత్వర ప్రయాణానికి
సైకిలుంటే చాల్లు !... ॥పొ॥

# మూఢత్వం!

ప్రకృతి ప్రతి చర్య వెనుక
శాస్త్రాధారం వుంది!...
మూఢ నమ్మకం వీడిన
ముందు ప్రగతి మనకుంది !... ॥ప్ర॥

ఇతర గ్రహపు క్రీనీడలు
చంద్ర, సూర్యగ్రహణాలు !
భౌతిక శాస్త్రం లోపలి
భౌగోళిక గమనాలు ! ॥ప్ర॥

రాళ్ళనెల్ల మొక్కుచూ
రాత్రి చదువునే మాని
పడుకున్నచో నీవు
పరీక్ష "ప్యాసై" పోవు ... ॥ప్ర॥

కనికరమే దైవత్వం,
క్రూరత్వమె అసురత్వం! ...
ప్రేమతో మననెంచి
పెంచు మానవత్వం !... ॥ప్ర॥

# కాలాలు

ఉరుముల మెరుపుల వానలతో ....
మట్టిలో విరివిగ పంటలనే ....
పండించేది వానాకాలం।

గజ గజ వణికించే చలితో ....
భోగి మంటల సంక్రాంతులతో ....
ఏతెంచేది శీతాకాలం।

చెరువులు, నదులు యింకి పోవగా ....
మండు టెండలను కుమ్మరించగా ....
అరుదెంచేది ఎండాకాలం।



# మనమంతా బంధువులం

మనమంతా బంధువులం ! ...
మానవతా సింధువులం ! ...
భారత పద్మములో ఉదయించిన
తీయని తేనియ బిందువులం ! ... ॥మ॥

హిందువులం ! ముస్లిములం !
సిక్కు, పార్శీ, క్రైస్తవులం !
ఒకేతల్లి ఒడిలోన జనించిన
అనేక మతాల అన్నదమ్ములం ! ॥మ॥

ఒకేతోటలో వరుసగ విరిసిన
ఓరిమి కలిగిన తీవియలం !
ఒకేమాలలో ప్రేమగ ఒదిగిన
రకరకాల రంగు పువ్వులం ! ॥మ॥

తీవియలన్నీ తీవ్రవాదమున
పోరుసలిపితే తోటకుచేటు !
పూవులు అన్నీ వేరయిపోతే
వేడుకైన పూమాలకు వేటు ! ॥మ॥

# భరతదేశవాసులం

భరతదేశ వాసులం ! ...
భరతమాత అసువులం ! ...
బంగారపు సింగారపు
భవితవ్య నివాసులం ! ||౧||

గంగ, కృష్ణ, గోదావరి
తుంగభద్ర ఝరులు !
వన్నెదెచ్చు జగానికే
ఉన్నత హిమగిరులు !

అన్ని వున్నవారలం ! ...
అశాంతికే దూరులం ! ||౨||

బుద్ధుడూ, మహాత్మగాంధి
పుట్టిన యీ పుణ్యభూమి !
మువ్వన్నె పతాకమ్మున
ముచ్చటైన జన్మభూమి !

సత్య, శాంతి జీవులం ! ...
సౌరభాల పూవులం ! ... ||౩||

# దేవుడే రాముడై పుట్టాడు రా !

దేవుడే రాముడై పుట్టాడురా ! ...
మనిషిలా మనలాగే మసలాడురా ! ...
ఆదర్శం చేసుకోర అతడి బాటను
ఆపైన మార్చుకోర నీ బ్రతుకును ॥దే॥

శివుని విల్లునే ఫెళ్లున విరిచాడురా !
సీతమ్మనే సతిగా పొందాడురా !
ఒక్కటే బాణమని, ఒక్కతే భార్యయని
లోకానికి ఆదర్శం అయ్యాడురా ! ॥దే॥

తండ్రి ఆజ్ఞ నెరవేర్చగ
తమ్మునికే రాజ్యమొసగ
తప్పనిసరి అడవికెళ్లిపొయ్యాడురా !
మెప్పుగా త్యాగాలే చేశాడురా ! ... ॥దే॥

రావణాది రాక్షసులను చంపాడురా !
రామరాజ్య సౌఖ్యాలను పంచాడురా !
ధర్మమే దైవమని చాటాడురా !
ఆపైన దేవుడై వెలిశాడురా ...! ॥దే॥

# చెట్లే ప్రగతికి తొలి మెట్లు !

చెట్లే ప్రగతికి తొలిమెట్లు !
చెట్లే జగతికి పనిముట్లు !
అందుకె వాటిని పెంచాలి !
ఆనందాలను పంచాలి ! ॥చె॥

మండుటెండలో నీడలనిచ్చి
మాడే కడుపుకు ఫలాలనిచ్చి
మనుషుల కాచును చెట్లు,
దేవుని దీవెనలైనట్లు ! ... ॥చె॥

కంపుగొట్టు విష వాయువులన్ని
కడుపునింద తామేపీల్చి
ప్రాణవాయువుల మనకందించి,
పరిసరాల రక్షించును చెట్లు ! ... ॥చె॥

ఆకాశంలో విహరించే
మేఘాలను ఆకర్షించీ ...
వర్షాలను కురిపించేవి
వన్నెలెన్నో కలిగించేవి
చెట్లు ... చెట్లు ... చెట్లు ...

అందుకె వాటిని పెంచాలి !
అన్నిట వృద్ధిని గాంచాలి ! ॥చె॥



# ఝాన్సీ రాణి

స్వాతంత్ర్య సాధనకై
సాగించిన సమరంలో
ఝాన్సీరాణీ చరితం,
కరుణ, వీర రసభరితం ... ॥స్వా॥

అబలయైననూ జడియక
వెనుకడుగసలేవేయక
ఉక్కు శిరస్త్రాణముతో
మొక్కవోని శౌర్యముతో

ఝళిపించెను తన ఖడ్గం ! ...
కావగ ఝాన్సీ దుర్గం ! ... ॥స్వా॥

విదేశీయ కుతంత్రాల
విచ్చుకత్తి కెరజేసిన
స్వదేశీయ సాహసాల
సబలగా అడుగేసిన

తొలి భారత వీరనారి
మ్రోగించె స్వతంత్రభేరి ॥స్వా॥

స్వేచ్ఛా పరిరక్షణకై
శ్వేతజాతి నెదిరించిన
అమరగాధ లన్నిటినీ
నెమరువేసుకుందాం!

అనవరతం స్వాతంత్ర్యం
కాపాడుకుందాం!!... ॥స్వా॥



# గుహుని గీతం

కోలు కోలు కోదండ రామయ్యా ! ...
మమ్మేలు మారాజు నీవయ్యా ! ... ॥కో॥

పాతకి ఆ తాటకినే అణచినావయా !
పరమఋషుల యాగమునే కాచినావయా !
శివుని విల్లు చిటికెలో విరిచినావయా
మాయమ్మ సీతమ్మను వలచినావయా ॥కో॥

సురగంగ నీకాళ్ళ కడుగంగ
దిగిరాగ మారింది యీగంగ
అది దాటలేక నా యీ బెంగ ?
వచ్చావు నను ధన్యుని జేయంగ ! ... ॥కో॥

సంసార సంద్రాల దాటించే నీకు
గోదారిని నేనే దాటించాలా ? ...
రాతిని నాతిగ మార్చిన రామయ్యా
నా జాతిని దయచూడగ రావయ్యా ! ॥కో॥

# ఉగాది జీవితం!....

ఉగాది అదిగో అరుదెంచే ....
జగాన శోభలు వ్యాపించే ....
చేదు, తీపినీ కలగలపి
జీవిత సత్యా లెరిగించే .... ||ఉ||

కొండలందునా, కోనలందునా
కోయిల కూతలె వినిపించే ....
కొమ్మ కొమ్మలో, రెమ్మ రెమ్మలో ....
కొసరే పూతలె కనిపించే .... ||ఉ||

గున్నమామిడి పెళ్ళికూతురై
సిగ్గు మొగ్గలా చిగురించే ....
మధుమాసమ్మని ప్రతికుసుమం
మకరందాలను చిలికించే .... ||ఉ||

ఆనందముగా చిలుక తేరుపై
ఆమని దొరయే ఏతెంచే ....
పూల ఋతువులో రంగు రంగులా
పుడమి యంతయూ పులకించే .... ||ఉ||

ద

# కులమతాల కుమ్ములాట

కుల మతాల కుమ్ములాట లేలరా ? ....
కూడి పాడు ప్రగతి సీమ నేలగా ! .... ||కు||

పంకములో జన్మించిన
పద్మం సైతం
పరిమళాల పంచునుగా ! ....
ప్రజలను మురిపించునుగా ! .... ||కు||

కురిసే మేఘానికి
కులమనేది లేదుగా !....
గాలి, వెలుతురుకు సైతం
మత మనేది లేదుగా ! .... ||కు||

వాటితో జీవించే
వసుధలోని నరులకే
కుల మతాల పంతమేల ? ....
కుటిలమైన కక్షలేల ? .... ||కు||

# నాగరికత

చూడరా ! తిరగేసి
మనిషి జీవితం ! ....
పాడరా ! నెమరేసి
నాగరికత గీతం ! .... ||చూ||

రాతి యుగం నాటి నుండి
రాకెట్ యుగం వరకూ
ఎదిగిన యీ నాగరికత
ఎంతటిదో తెలుసుకో ! ||చూ||

ఆది కాల మందునా
ఆకులనే చుట్టుకొని
ఆపైన తెలివి పెరిగి
వలువలనే కట్టుకొని ||ఆది||

మనుగడనే మార్చాడు
మనిషిగా నిలిచాడు
చదువుల సారాల నెరిగి
చంద్రుడినే గెలిచాడు ||చూ||

"కల్చర్" పేరున కడకు
"క్యాబరే"కు మరిగాడు !
వె్రి వె్రి సరదాలతొ
వెనుకకే నడిచాడు ! ॥చూ॥



# అందం

చదువుకు అందం సంస్కారం ! ....
మనసుకు అందం మమకారం ! ....
మనిషికి అందం సహకారం ! ....
మనుగడ కందం ఉపకారం ! .... ||చ||

పూలకు అందం సుగంధం
మాలకు అందం సుమబృందం
ప్రేమకు అందం అనుబంధం
మోముకు అందం ఆనందం ||చ||

మోవికి అందం మృదుహాసం
ప్రోడుల కందం మధుమాసం
పడతుల కందం సింగారం
ఫాలము కందం సింధూరం ||చ||

ఉదయము కందం రవి కిరణం
హృదయము కందం సంస్కరణం
జాతికి అందం అభ్యుదయం
జగతికి అందం ప్రగతి పథం ||చ||

# నవ్వే పువ్వును నలుపకు

నవ్వే పువ్వును నలుపకు !
వెలిగే దివ్వెను మలుపకు !
పెదవికి నవ్వును అతుకకు !
ఎదలో కుళ్ళుతొ బ్రతుకకు ! ॥న॥

గూడును జేరే గువ్వకు
గురితో బాణము వేయకు !
బాధల మరచే బీదల
బ్రతుకున బాకులు దూయకు ! ॥న॥

వేకువ వెదికే వారికి
చీకటి దారుల చూపకు !
తీయని మాటలతో టే
మాయని గాయం రేపకు ! ॥న॥

మానవత్వమును మరువకు
మంచి నెప్పుడూ విడువకు !
అవరోధాలకు వెరువకు
అశాంతిలోనే ఝురువకు ! ॥న॥

# ఎగరేయీా మనజెండా

ఎగరేయీా మనజెండా ! ....
సొగసైనా పూదండా ! ....
ఎగరేయీా పూదండా
గగనేందిర సిగనిండా ! .... ॥ఎ॥

స్వాతంత్ర్యపు సాధనకై
సర్వస్వము అర్పించిన
అమర వీరులను గాంచగ
అంబరాల చుంబించగ ॥ఎ॥

బాపూజీ జాడలలో
బానిసత్వమును వీడిన
భరత జాతి భావి భాగ్య
బంగారపు కలలుపండ ॥ఎ॥

నవ్వులొలుకు పతాకమ్ము
నలుదెసలను నటియించగ
సత్యాహింసల నెల్లెడ
నిత్యమ్మును ప్రకటించగ ॥ఎ॥

# తెలుగు వారలం

తెలుగు వారలం ! ....
మనం తెలుగు వీరులం ! ....
వెలితిలేని సాహసాల
వెలుగు ధీరులం ! .... ॥తె॥

వీరనారి రుద్రమాంబ
వీరపత్ని మాంచాలా
అబలలన్న అతివలనే
సబలలు చేశారురా ! .... ॥తె॥

అలనాటి పలనాటి
బాలచంద్రుడే గాక
తెలుగునాట ఎందరో
తేజరిల్లి నారురా ! .... ॥తె॥

తెల్ల దొరల ఉల్లములో
బల్లెమైన అల్లూరీ,
భయమెరుగని టంగుటూరి
అంతా మన వారురా ! .... ॥తె॥

# మేలుకో ! మేలుకో

మేలుకో ! మేలుకో !....
మేలుకో ! మేలుకో !...
పగలు రేయి కష్టించి
ప్రగతి రాజ్య మేలుకో ! ॥మే॥

మందగింపు దేనికింపు ?
ముందు దాన్ని చంపుకో !...
ఉత్సాహం, ఉత్తేజం
హృది నిండా నింపుకో !... ॥మే॥

తోటి వాడు దాటిపోగ
వెనుక పడుట ఎందుకో ? ...
శక్తికొలది పాటుపడగ
శరవేగము నందుకో !... ॥మే॥

కండబలం, గుండెబలం
కలకాలం పెంచుకో ! ...
అందరిలా ముందుకేగి
అభ్యుదయం పంచుకో !... ॥మే॥

# దేశ వృక్షం

భారతదేశం ఒక వృక్షం ! ...
పౌరులె అందరి పత్ర సమూహం !.... ||భా||

మతాలన్నీ కొమ్మలు కాగా
కులాలన్నీ రెమ్మలు కావా ?
కొమ్మల రెమ్మల్లో తలయెత్తిన
ఆకులే జనావళి కాదా ? ||భా||

కొమ్మ కొమ్మకూ, రెమ్మరెమ్మకూ
కొట్లాటలు పెరిగాయంటే
ఆకులు నేలకు రాలేను
పూవుల ప్రగతులు కూలేను ||భా||

జాతీయతయే మూలవేరురా
ఐక్యత కదియే మారుపేరురా !...
ఆ భావం అణగారిందంటే
దేశ వృక్షమే కూలునురా ! ... ||భా||

# పొదుపు

పొందికగా మసలుకో ! ...
పొదుపనేది నేర్చుకో !... ॥పొ॥

అలసత్వం అణచుకో
శ్రమతత్వం పెంచుకో !
రేబవలూ కష్టించీ
రేపటికై దాచుకో ! ॥పొ॥

ఉన్ననాడు ఉన్నదంత
"స్వాహా" గావించకు !
లేనినాడు వేదనతో
ఆహా ! యని ఏడ్వకు ! ॥పొ॥

ఏరు పారు నపుడె ముందు
ఊరి చెరువు నింపుకో ! ...
నిండు ఎండ కాలమందు
నీటి కరువు బాపుకో !... ॥పొ॥

నేటి పొదుపు మరునాటికి
అవుతుందొక మంచి మలుపు
అడుగడుగున జీవితాన
కలుగుతుంది నీకు గెలుపు ! ॥పొ॥



# సంక్రాంతి

వచ్చెనదిగో సంక్రాంతి !
తెచ్చెనదిగో మధుర క్రాంతి ! ॥వ॥

ఇంటి ఇంటికి, ఇంతి ఇంతికి
కంటికింపుగ కానవచ్చె
బంతిపూచేమంతి సరుల
వింత గొలిపే నూత్న కాంతుల ॥వ॥

అల్లనల్లన అడుగులిడుతూ
చిలిపి ఊహల తలుపు తడుతూ
మంచుతేరున మనోహరముగ
అంచలా అరుదెంచె నదిగో !... ॥వ॥

రంగు రంగుల రంగవల్లులు
రమణులంతా తీర్చి దిద్దగ
రంకెలేయగ నంది గణములు
ఊగ మెత్తగ దాసు గళములు ॥వ॥

పసిడి పంటలు పలకరించగ
పడుచు జంటలు పులకరించగ
తాండవించే మెండు చలినే
భోగి మంటలతో హరించగ ॥వ॥



# ప్రశ్న

వేసుకో మనసులో
ప్రతి పనికో ప్రశ్న !...
పెంచుకో అదే పనిగ
ప్రశ్నించే తృష్ణ !... ॥వే॥

ఏది ఎలా జరుగుతోంది ?
ఎందుకలా జరుగుతోంది ?
అనే ప్రశ్న వేయి బాబు
అందుతుంది జవాబు ! ॥వే॥

ప్రశ్నించే మనసుంటే
పరిశోధన తోడుంటే
విషయాలు గ్రహిస్తారు
విజ్ఞానులు అవుతారు ॥వే॥

ఎందుకనే ప్రశ్నలతో
ముందుకేగి ఎందరో
ఆధారాలన్ని ఎరిగి
మేధావులు అయ్యారు ॥వే॥

# యువతరం

కదలి కదలి రావాలి యువతరం!
కదలి కెరటమై ఇలపై నవతరం ! ||క||

వివేకానందునిలా ...
విజ్ఞానపు గనులై ...
అమర బాల చంద్రునిలా
సమర వీర వరులై ... ||క||

వైవాహిక జీవితాల
వర కట్న దురాగతాల
వడి వడిగా అణచేయగ
వనితల సంరక్షించగ ||క||

అక్రమ మార్గాల లోన
విక్రమించు అవినీతికి
అంతమ్మును కలిగించగ
పంతమ్మున పయనించగ ||క||

# త్యాగరాజా !

మధుర రాగాల
మా త్యాగరాజా ! ....
మృదుల భావాల
ఓ రాగ రాజా !... ॥మ॥

నీ పద సన్నిధి
మా కది పెన్నిధి !
దాటించే నది
ఈ భవ వారిధి ! ॥మ॥

శ్రుతిగల నీ కృతులు
రాగాల ఆకృతులు !
కోదండ పాణిని
కొలిచే సన్నుతులు ! ॥మ॥

రాముడన్నా ....
రాగమన్నా ....
భక్తి అపారం !
భజన అమోఘం !... ॥మ॥

# భా వి పౌ రు లు

## ( సంగీత, నృత్య రూపకం )

(అది ఒక బడి. ఆ బడి తోటలో ఒక వైపు మగ పిల్లలు మరొక వైపు ఆడపిల్లలు వరుసగా నిలబడి వుంటారు. వారి నుద్దేశిస్తూ ఒక ఉపాధ్యాయుడు, మరొక ఉపాధ్యాయిని యిలా ప్రబోధ గీత మాలపిస్తారు.)

ఉపాధ్యాయుడు : బాలల్లారా ! రండీ !...
(అతడు) భావి పౌరుల్లారా ! రండీ !...

ఉపాధ్యాయిని : పిల్లల్లారా ! రండీ !...
(ఆమె) మంచి మల్లెల్లారా రండీ !... ||బాల||

అతడు : పొద్దు పొడవక ముందే మీరు
బుద్ధిగ నిద్దుర లేవాలి !

ఆమె : తప్పని సరిగా స్నానం చేసి
మెప్పుగ బడికే రావాలి !

అతడు : విద్యతో పాటుగ శ్రద్ధా సక్తితో
వినయం నేర్చుకోవాలి !

ఆమె : పెద్దలందరిని ఎల్ల వేళలా
ప్రేమతో గౌరవించాలి ! ॥బాల॥

అతడు : చదువును మించిన సంస్కారం
పదిలంగా సాధించాలి !

ఆమె : మనసును గెలిచే మమకారం
అందరికీ అందించాలి !

అతడు : దీక్షతో చదివి పరీక్షలందున
దీటుగా రాణించాలి !

ఆమె : భక్తితో మార్కండేయునిలా
మృత్యువునైనా మరలించాలి !

అతడు : దృఢమగు దీక్షతో ధృవుడిలా
భగవంతుడినే మెప్పించాలి !

ఆమె : గగనంలో గరుత్మంతునిలా
తల్లి దాస్యమే తొలగించాలి !

అతడు : ఉత్సాహంతో అభిమన్యునిలా
వ్యూహాలన్నీ ఛేదించాలి !

ఆమె : జైన - బౌద్ధ- క్రైస్తవంలా
రామ్ - రహీమ్ - నానక్‌లా

అతడు : శాంతి ధర్మముల బోధించాలి
సమ భావంతో జీవించాలి

ఆమె : వీరశివాజీ - ఝాన్సీరాణీ
వీర మూర్తులను తలవాలి !

అతడు : చాచాజీ వలె శాంతి దూతలై
జాతి నేతలై నిలవాలి !

ఆమె : బాపూజీ వలె సత్యా హింసల
బాటల్లోనే సాగాలి !

అతడు : "జై జవాన్ - జై కిసాన్" అని
శాస్త్రీజీ వలె చాటాలి !

పిల్లలు : "జై జవాన్ - జై కిసాన్ !" అని
శాస్త్రీజీ వలె చాటాలి !

||జాలి||

అతడు : శాస్త్రవేత్త - సి.వి. రామన్
జగదీశ్ చంద్రబోస్

ఆమె : తత్త్వవేత్త - రాధాకృష్ణన్
అరవిందునిలా వెలగాలి !

పిల్లలు : శౌర్యముతోడ రుద్రమాంబలా
వైరులందరిని ఎదిరిస్తాం !
ధైర్యముతోడ మాంచాలలా
కర్తవ్యాలను ఎరిగిస్తాం !

సద్గుణరాశి సరోజినీదేవి
స్వతంత్ర భావ గీతికలం !
అమరేందిర - ఇందిరాగాంధి
సమైక్యతకు మేం ప్రతీకలం !

నేతాజీ - సర్దార్ పటేల్
బాబాసాహెబ్ అంబేద్కర్
అల్లూరి - ఆంధ్రకేసరి
అడుగు జాడలో పయనిస్తాం !

విజయ వివేకానందునిలా
విజ్ఞాన జ్యోతులే వెలిగిస్తాం ! ॥శా॥

అతడు : రసరమ్యంగా భాగవతాన్ని
రచియించిన మన మధుర కవి
ఎవరో మీకు తెలుసా ?...

పిల్లలు : ఆఁ ! ఇంకెవరు ? మన బమ్మెర పోతన !

ఆమె : తన రాగాలతో దేశీయుల్ని
తన్మయ పరచిన గాయకుడు
ఎవరో మీకు తెలుసా ?....

పిల్లలు : ఆఁ ! తెలుసు ! అతడే త్యాగరాజు -
నాద బ్రహ్మయగు రాగరాజు !

అతడు : కూచిపూడి నాట్యానికి ఆద్యుడు
నవీన నాట్య జగతికి పూజ్యుడు
ఎవరో మీకు తెలుసా ?...

పిల్లలు : ఆఁ ! అతడే సిద్ధేంద్రయోగి !

ఆమె : వర్ధిల్లాలిక మీరంతా
వారి బాటలోసాగి ! ||బాల||

అతడు : మానవతయె మనమతమనియెంచి
మమతా సమతల పెంచాలి !

ఆమె : కరుణను పెంచి కలిమిని పంచి
కలిసి మెలిసి జీవించాలి !

అతడు : ఐకమత్యమే మహా బలమ్మని
అందరమూ ఆశించాలి !

ఆమె : జగతిలోన మన జాతి పతాకం
భానురీతి భాసించాలి ! ॥భా॥

ిల్లలు : పెద్దల మాటలో - బంగరు బాటలో
బుద్ధిగ, శ్రద్ధగ పయనిస్తాం !
చదువుల సౌరభసారం పొంది
పువ్వుల్లాగా వికసిస్తాం !

ందరు కలిసి : శాంతి కాంతితో వెలుగు భారతీ ! ....
అందుకొనుము అనురాగ హారతీ ! ...
తెలుగు తేజముతో వెలుగు భారతీ ! ....
తెచ్చెద మమ్మా నీకు కీర్తి ! ....

॥శాంతి॥

# బాలానందం – భాగ్యనగర అందం

## ( సంగీత రూపకం )

అనేక మతాలకూ, సంస్కృతులకూ పునాదిగా, పరమత సహనానికి ప్రతీకగా క్రీ.శ. 1591లో మహ్మద్ కులీకుతుబ్‌షా చేతుల మీదుగా అవతరించిన భాగ్యనగరం ఆ తర్వాత హైదరాబాదుగా అభివృద్ధి గాంచి నేటికి నాలుగు వందల సంవత్సరాల చరిత్రను సంతరించుకున్నది. ఆ చరిత్ర చెరగని పుటలు, స్మృతులు మన కళ్ళముందింకా కమనీయంగా కదలాడుతూనే వున్నాయి —

పల్లవి : అదిగదిగో అందాల భాగ్యనగరము....
అన్ని మతాలకు నిలయం యీ నగరము ....

||అది||

ప్రేయసి యగు భాగ్యమతి పేరుతో
కట్టించెను కులీ కుతుబ్ ప్రేమతో
ఆపై వెలుగొందెనదే హైదరాబాదుగా !....
అందరు అభిమానించే ఆంధ్రరాజధానిగా !....

||అది||

( గోల్కొండ )

గొల్లవాడు కనుగొన్న గొల్లకొండయే....
ఎల్లెడలా పేరుగాంచె "గోలుకొండ"యై ....
కుతుబ్ షాహి వంశీయుల గోల్కొండ కోట
కుతూహలము కలిగించును చూడగ ప్రతిచోట

॥అది॥

ఉన్నతమగు మేడలు, విశాలమగు వీధులు
అంగట్లో రత్నాలను అమ్మినట్లు గాథలు !...
గజ, అశ్వశాలలు, పలు రాచబాటలు
కన్నుల నాకర్షించే కమనీయపు తోటలు

॥అది॥

నాటి నాగరికత తెలుపు నీటి సరఫరా విధము
నేటికి కలిగించును చూపరులకు విస్మయము
చిటికె వేసినా చాలు, చిటికెలోన శబ్దాలను
చిత్రంగా పైకి చేర్చు రహస్యాల కుడ్యాలు !

అందుకే కన్నుకుట్టి ఔరంగజేబు
అదే పనిగ దాడిచేసి వశము చేసుకొనెను ! ...

॥అది॥

అక్కన్న-మాదన్నల మంత్రిత్వముతో
ఆఖరులో వెలుగొందెను తానీషా ప్రభువు ! ...
భక్త రామదాసునే చెరలో బంధించి
ధన్యుడాయె తుదకు రామ చంద్రునేగాంచి ! ...

॥అది॥

( సమాధులు )

కుతుబ్ షాహీ సమాధులు
పునీత సంస్కృతి పునాదులు ! ...
కావవి కేవల శవ పేటికలు
సజీవ సంస్కృతి వన వాటికలు !...

॥అది॥

( పురానాపూల్ )

మునీశ్వరుడు ముచికుందుని పేరుతో
ముంగిట మూసీ నదియై పారగా ....
ఆనాటి నగరానికి వన్నెలెన్నో కలిగించెను
ఈనాటి నగరానికి దుర్గంధా లందించెను

వరద వచ్చి మూసీనది
ఎంతగ ఉప్పొంగినా ...
వలపు హెచ్చి కులీకుతుబ్
వనిత భాగ్యమతికై

తెగువతోడ దాటనెంచ
తెలిసినంత ఇబ్రహీం
కన్న కొడుకు క్షేమంకై
కట్టించెను ఒక వంతెన
అదే పురానాపూల్‌గ
అగుపించును నేటికి ॥అది॥

(చార్మినార్)

ప్లేగు వ్యాధి నిర్మూలన
పేరున నెలకొలుపగా
కుతుబ్ షాహి వాస్తు ప్రతిభ
నలు దిశలా చాటగా ....
నయనా నందము గొలుపగ
నాలుగు మినారులతో....
"చార్మినార్"గా వెలసెను
చారిత్రక కట్టడం !....
హైదరాబాదు కదే
అందమైన దర్పణం ! ॥అది॥

(మ్యూజియం)

ప్రపంచాన అగుపించే
పలు వింతవస్తువులకు
ఒక వేదికయై నిలిచెను
"సాలార్ జంగ్ మ్యూజియం !"

వివిధ మతాలెన్నెన్నో
విభిన్న సంస్కృతులెన్నో
లతల వోలె అల్లుకున్న
లక్షణముగ కలిసివున్న
పరమత సహనపు పాదు
అది మన హైదరాబాదు !... ॥అది॥

(మక్కా మసీదు)

"అల్లాహో అక్బర్
అల్లాహో అక్బర్"-
అని ముస్లిం లందరూ
ఆర్తిగ ప్రార్థించగ
ఆనాడే వెలసినది
పవిత్ర మక్కా మసీదు !....
విశాలమగు స్థలముతో
వెలిసిన మక్కా మసీదు !....

(బిర్లామందిర్)

"గోవిందా! గోవిందా!...
పాహిమాం పాదారవిందా!"....
అని హిందువులందరూ
ఘన పూజలు గావిస్తూ
ఏడు కొండల స్వామిని
వేడుకొనగ వెలుగొందే

పాలరాతి మందిరం
అది "బిర్లా మందిరం!"...
అచటి నుండి తిలకించిన
నగరం అతి సుందరం! ॥అది॥

(జైన్ మందిర్)

అహింసనే ఆశించే
జైన జనుల ఆలయం
మహావీర మందిరం
అదే జైన మందిరం

(గురుద్వార్)

గురు నానక్ సూక్తులతో
గుర్‌బాణీ వినిపించే
సిక్కుల గురుద్వార్ అదే !
కృపాణ మతద్వార్ అదే !...

(చర్చి)

సహనానికి పునాదియై
శిలువ మీద సమాధియై
కరుణామయుడై నిలిచిన
క్రీస్తు మందిరం అదిగో !... ॥అది॥

అటూ యిటూ జనులతో
అవలీలగ తిరుగాడగ
ఎటు చూసిన రిక్షాలే
ఎదురయ్యే నగరం !...

లతల హరిత ప్రాంగణం
"లలిత కళా తోరణం"
అదియే పబ్లిక్ గార్డెన్ !...
అందులోనే బాలభవన్ !...

చట్టాలెన్నో రూపొందించే
శాసన సభ్యులు చర్చించే
అసెంబ్లి హాలు అదిగో !...
జూబిలీ హాలు ఇదిగో.... ॥అది॥

రక రకాల కళలెన్నో
రమ్యంగా ప్రదర్శించ
రంగస్థలమై నిలిచిన
"రవీంద్ర భారతి" అదిగో !...

పాటలు నాటికలే గాక
అనేక వార్తలనన్ని దిశలకు
ఏక కాలమున అందించే
"ఆకాశవాణి" అదిగో !...

దూర దూర ప్రాంతాల ప్రేక్షకుల
దృష్టిని ఆకర్షించే విధముగ
"సీరియల్స్" ప్రసారం చేసే
దూరదర్శిని ఇదిగో !... ॥అది॥

దేశ విదేశాలెచ్చటికైనా
గగన విహారం గావిస్తూ
వాయు వేగమున చేరిపోవగ
విమాన కేంద్రం అదిగో !...

సినీతారల తళుకులతో
చిత్రమైన సెట్టింగులతో
చూసేవారిని మైమరిపించే
స్టూడియోలు అవిగో !...

నగరానికి నలు దిక్కుల
నవ్వుతు నోరూరిస్తూ
లక్షణముగ కనిపించే
ద్రాక్షతోటలవిగో!

పల్లెలు, జిల్లాలనుండి
కొల్లలుగా తరలి వచ్చి
ప్రజల అవసరాల తీర్చు
పళ్ళ మార్కెటు అదిగో !... ॥అది॥

అనాదిగా నగరానికి
అవసరమగు మంచినీరు
అందించే జలాశయం
గండిపేట అదిగో !...

నాటి రాతి కట్టడాన
నేటి విద్యలందించే
యూనివర్శిటీలోని
ఆర్ట్సు కాలేజదిగో !...

వివిధ పరిశ్రమలతో
విజ్ఞానపు యంత్రాలతో
విలసిల్లే సనత్‌నగర్,
బాలా నగర్ అదిగో !...
గొప్ప గొప్ప పరిశ్రమల
ఉప్పల్, మౌలాలిదిగో !... ॥అది॥

(జవహర్ జంతు ప్రదర్శన శాల)

పిల్లల నమితముగా ప్రేమించే
ప్రియతమ ప్రధాని జవహర్ పేరున
వెలసిన జంతు ప్రదర్శనశాల !...
దోచును బాలల మనసును చాల !...

విశాల విస్తీర్ణంతో
వివిధ జంతు జాలంతో
వినోదాలు కలిగించే
విశిష్టమగు "జూ" అదిగో !...

ఒంటెలకు, ఏనుగులకు
కొంటె పనుల కోతులకూ
క్రూరమైన పులులకూ
కూడలి యగు "జూ" ఇదిగో ! ...

జాతరతో జల్సాతో
ఉగ్రూత లూగించే
ఉజ్జయినీ మహంకాళి
ఉన్న సికింద్రాబాదిదిగో !... ॥అది॥

(ట్యాంక్ బండ్)

జంట నగరముల వారధిగా
కంటికి యింపగు నీరధిగా
తెలుగు వెలుగుల విగ్రహాలకు
తేజరిల్లు నవ వేదికగా
అగుపించే వినాయక్ సాగర్,
అదే అదే హుస్సేన్ సాగర్ ! ॥అది॥

(శాలివాహనుడు)

ప్రప్రథమాంధ్ర రాజ్య స్థాపకుడు
తెలుగు శకానికి మూల కారకుడు
"శాలి వాహనుడు" అతడే !
ప్రతిభా శాలివాహనుడు అతడే !...

(నన్నయ)

తెలుగు కావ్యమును మొట్టమొదటగా
తేనె లొలుక రచియించిన వాడు
"వాగను శాసన" బిరుదాంకితుడు
ఆది కవి నన్నయ్య అతడే !

(తిక్కన)

ఆంధ్ర భారతం అత్యధికం
అమోఘంగా తీర్చి దిద్దిన
"కవి బ్రహ్మ"గా గణుతికెక్కిన
తిక్కన సోమయాజి అతడే !...

(ఎర్రాప్రగడ)

శేష భారతా పూరణ దక్షుడు
అశేష ఆగమశాస్త్ర నిపుణుడు
ఎర్రా ప్రగడ అతడే అతడే !...
"ఉభయ కవి మిత్రుడు" అతడే ! ...

(అన్నమాచార్య)

వేన వేల కీర్తనలతో
వెంకటేశ్వరుని కొలిచిన
పద కవితా పితామహుడు
"అన్నమయ్య" అతడే !...

(పోతన)

మందార మకరంద మాధుర్య సముపేత
రస రమ్యమగు భక్తి భావాల వడబోత
మధురాంధ్ర భాగవత కావ్యకర్త
మన పోతనామాత్యుడతడే !...

(వేమన)

సంఘ దురాచారాలను
ఛాంద సత్వ భావాలను
ఆట వెలదితో అణచెను
అతడే మన వేమన్న !...

(సిద్ధేంద్ర యోగి)

ఖండాంతర ఖ్యాతితో అలరారే
కూచిపూడి నాట్యరీతి కాద్యుడు
తెలుగు నాట్య జగతికి ఆరాధ్యుడు
అతడే అతడే సిద్ధేంద్ర యోగి !...

(తానీషా)

భక్త రామదాసునే చెరలో బంధించి
కడకు రామ చంద్రునే కళ్ళారా గాంచి
ధన్యుడాయె గోలకొండ చివరి పాదుషా !
మత సహనం గల మనీషి అతడు తానీషా !....

(మొల్ల)

రామాయణ కావ్యమును
రమ్యంగా రచియించిన
మొదటి ఆంధ్ర కవయిత్రి
మొల్ల ఆమెయే !...

(బ్రహ్మనాయుడు)

అలనాటి పలనాటి మేటి వీరుడు
చాపకూటితో సమతను చాటి నట్టి ధీరుడు
అతడే అతడే మన బ్రహ్మనాయుడు ....

(పోతులూరి వీరబ్రహ్మం)

కాలజ్ఞాన భవితవ్యం
ముందుగానే వెల్లడించి
వేదాంత తత్వాలను
వివరంగా బోధించి
విరాజిల్లి నట్టి యోగి
వీర బ్రహ్మం అతడే !....

(క్షేత్రయ్య)

మువ్వ గోపాలునికై
మధుర భక్తి భావరాగ
అభినయ పద కవితలల్లి
అల్లరార్చిన క్షేత్రయ్య, అతడే !

(శ్రీ కృష్ణదేవరాయలు)

సాహితీ సమరాంగణ సార్వభౌముడు
పెద్దనాది కవులలెల్ల పోషించిన మాన్యుడు
పలు ప్రబంధాలు విరియ పాటు పడిన రాజన్యుడు
ఆంధ్ర భోజుడైన కృష్ణ దేవరాయలతడే !....

(రామదాసు)

భక్తి పారవశ్యంతో కర్తవ్యం మరచి
భద్రాచల రామునికి గుడినే కట్టించి
చెరలో పడి వగచి వగచి
తెలుగువారి ఎదల నిలిచి
రాజిల్లిన రామదాసు అతడే !....
విరాజిల్లిన రామదాసు అతడే !....

( త్యాగయ్య )

రామనామ గానంతో
భోగత్యాగ యోగంతో
శ్రుతి పలికే కృతులల్లిన
అతడే మన "స్వర బ్రహ్మ" - త్యాగయ్య ! ....

( రఘుపతి వెంకటరత్నం నాయుడు )

బ్రహ్మ సమాజ కులపతి
"బ్రహ్మర్షి" బిరుదు విద్యాపతి
"ప్రేమే దైవం" అతని నినాదం
అతడే రఘుపతి వెంకటరత్నం ! ....

( శ్రీ శ్రీ )

పీడిత తాడిత కర్షక కార్మిక
అభ్యున్నతియే అతని ఆశయం ....
మరో ప్రపంచంలో మననెంచిన
మహాకవి శ్రీ శ్రీ అతడే ! ....

( జాషువా )

గబ్బిలమను కావ్యమ్మును
అబ్బురముగ విరచించిన
నవయుగ కవి చక్రవర్తి
దళిత వర్గ జ్వలిత స్ఫూర్తి
జాలువారెడు కవితా
జాషువా అతడే ! ....

(ముట్నూరి కృష్ణారావు)

సంపాదకీయాల జాతీయ భావాలు
పెంపొంద జేసిన ప్రబోధశాలి ! ....
అఖిలాంధ్ర సంచలన చైతన్యశాలి
అతడే ముట్నూరి కృష్ణారావు !

(సురవరం ప్రతాపరెడ్డి)

ఆంధ్రుల సాంఘిక చరిత్ర
గ్రంథ సూక్ష్మముల వ్యాఖ్యాత ....
వ్యాసరచనలోనూ వర్ధిల్లిన
అతడు సురవరం ప్రతాపరెడ్డి....

(మగ్దూం మొహియొద్దీన్)

అభ్యుదయ భావాల ఉర్దూ మహాకవి
అట్టడుగు జనులకు అతడు కవి కామ్రేడ్
అతడే మగ్దూం మొహియొద్దీన్
అతడే మగ్దూం మొహిమొద్దీన్ ....

(కందుకూరి వీరేశలింగం)

సమాజమున స్త్రీని సమాదరించిన
సంఘ సంస్కర్త - బహు గ్రంథకర్త
వివిధ సాహితీ ప్రక్రియా విష్కర్త
వీరేశలింగం అతడే అతడే !....

(పింగళి వెంకయ్య)

స్వాతంత్ర్య సమరానికి
జాతిని ఉత్తేజపరచి
మువ్వన్నెల మన జెండా
ముచ్చటగా సృష్టించి
ఆంధ్ర గౌరవం పెంచిన వాడు
అతడే పింగళి వెంకయ్య ! ....

(త్రిపురనేని రామస్వామి చౌదరి)

హేతువాద దృక్పథాన
నూతన సాహిత్య సృష్టి
అపూర్వముగ గావించిన
అతడే మన త్రిపురనేని!....

(సర్ ఆర్థర్ కాటన్)

సముద్రాల పాలయ్యే
గోదావరి నీరు నిలిపి
సస్యశ్యామలము జేసిన
"సర్ ఆర్థర్ కాటన్" అతడే !

(అల్లూరి సీతారామరాజు)

స్వాతంత్ర్య సాధనకై
సాయుధుడై సాహసాన
తెల్లదొరల నెదిరించిన
తెలుగు తల్లి బిడ్డడు,
అతడే మన అల్లూరి
సీతారామ రాజు!........

(బళ్ళారి రాఘవ)

ఆంధ్ర నాటక రంగ
ఆదిత్యుడనదగిన
సముదాత్త నటుడు
బళ్ళారి రాఘవ అతడు !....

(గురజాడ అప్పారావు)

మంచియన్నది పెంచుమంటూ
దేశమును ప్రేమించుమంటూ
నవ యుగానికి నాంది పలికిన
మహాకవి గురజాడ అతడే ! ....

(సర్ సి.వి.రెడ్డి)

విద్యా పరిపాలన నెరిగిన
విద్వద్విమర్శకుండు
సత్కవితావతంసుండు
సర్ సి.వి. రెడ్డి అతడు ! ....

(సర్వేపల్లి రాధాకృష్ణన్)

సమస్త భారత మూర్తీభూత
సజీవ సంస్కృతికి ఆకృతిగా
వేదాంత విజ్ఞాన ఖనిగా
వెలిగిన సర్వేపల్లి అతడే ! ....

(మహబూబ్ ఆలీఖాన్)

ఆసఫ్ జాహి వంశములో
అలరారిన రాజ్య పాలకుడు
ఆర్త జనుల సంరక్షకుడు
అతడే మహబూబ్ ఆలీఖాన్

(రుద్రమదేవి)

శత్రువు పాలిటి రుద్రరూపిణిగ
కత్తిని ఝళిపించిన తొలి కాంతగ
కాకతీయ సామ్రాజ్యము నేలిన
రాణీ రుద్రమదేవి ఆమెయే !....

(ప్రకాశం పంతులు)

నిండు ధైర్యమున మొండిగ
గుండుకు గుండెను చూపి
ఆంగ్లేయుల నెదిరించిన
"ఆంధ్ర కేసరి" ప్రకాశమతడే ! ...

(పొట్టి శ్రీరాములు)

ఆంధ్ర రాష్ట్ర అవతరణకు
ఆత్మత్యాగ మొనరించిన
అమరజీవిగా నిలిచిన
పొట్టి శ్రీరాములు అతడే !....

(తెలుగు తల్లి)

గోదావరి - కృష్ణానది
పలుపంటల పండించగ
అలరారే "అన్నపూర్ణ"
తెలుగు వెలుగులను గన్న

తెలుగుతల్లి అదిగో !
మన తెలుగుతల్లి అదిగో !.... ॥అది॥

అందరినీ ప్రేమించుట
ఐక్యంగా మన నెంచుట
స్వదేశాభిమానముతో
స్వతంత్రముగ జీవించుట

అన్నది యీ మహనీయుల
అభిమతమ్మని తెల్సుకో!....

సమతా మమతానురాగ
సౌజన్యం పెంచుకో !....
నలుగురితో కలిసిమెలిసి
నవ్వులనే పంచుకో !....

తరతరాల జ్ఞాపకాల
తనివిదీర తలచుకో !....
మనమంతా ఒక్కటనే
మంచిబాట నడచుకో !

॥అదిగదిగో॥



# బుద్ధుడు

జరా మరణములకు జడిసి
జీవిత సత్యాల నరసి
రాజభోగములనన్నీ
రాత్రికి రాత్రే విడచి
సాగినాడు తథాగతుడు
సత్యాన్వేషణ కోసం !

అడవులన్ని తిరిగిననూ
తపము లెన్ని చేసిననూ
కనుగొన జాలక తత్వం
కడకు "గయను" చేరినాడు

బోధివృక్ష ఛాయలోన
సతత ధ్యాన ముద్రలోన
అహింసయే పరమ ధర్మ
మని సిద్ధార్థుడు గ్రహించె !

బుద్ధి యెల్ల వికసించగ
బుద్ధుడిగా అవతరించె !
అతని బోధనల తోడనె
అవనియంతయూ తరించె !